# స్వప్న వాసవదత్తము

[భాసకృతికి తెనుగు]

కాటూరి వెంకటేశ్వరరావు

**12**
*annas*



# స్వప్నవాసవదత్తము

[భాసకృతికి తెనుగు]

కాటూరి వేంకటేశ్వరరావు

యువ బుక్ డిపో
ఆచారప్పన్ వీధి : : గవర్నరుపేట
మద్రాసు : : బెజవాడ

# స్థాపన

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్ర: సుమనవాసవదత్తాబలము, వసంత
క్రమ, ముదయనవత్సపాకరసవర్ణ
మైన బలరామదేవు పద్మావతీర్ణ
పూర్ణభుజయుగ్మ మెపుడు నిన్ బ్రోచుఁగాత.

ఆర్యమిశ్రులు నా విన్నపం అవధరించాలి :—ఇశ్శ్! ఏమిటా సందడి? నేనేదో విన్నవించుకొంటూవుంటే మధ్యలో ఈగొడ వేమిటో, అయినా, కనుగొంటాను.

(చెవియొగ్గి తొంగిచూచును)

(తెరలో) తొలఁగండయ్యలారా! తొలఁగండి!

సూత్ర: సరిసరి తెలిసింది. మగధమహారాజులుంగారి కుమార్తెగారు తపోవనానికి దయచేస్తున్నారట. ముందు వస్తున్న భృత్యులచట ఎవ్వరూ ఉండగూడదని వెడల గొట్టుతున్నారు.

(నిష్క్రమిస్తున్నాడు.)

——

# ప్రథమాంకము

(ఇద్దరు భటులు ప్రవేశించి)

భటులు : తొలగం డయ్యలారా! తొలగండి.

(పరివ్రాజక వేషమున యౌగంధరాయణుడును, అవంతికా వేష ధారిణి వాసవదత్తయు ప్రవేశింతురు.)

యౌగం : యిక్కడకూడా తొలగిపొమ్మనడమేనా!

తరుమూలమ్మె గృహమ్మె, వల్కలము వస్త్రం, బాకులుం గూరలుం
బరమాన్నమ్ముగఁ గాలముం గడపు సమ్మాన్యుల్ తపోరాసులం
వెలిపించుం జలభాగ్యమత్తుఁడగు నీవీటిండి యెవ్వండొ! శాం
తరసావాల తపోవనం బితని యానం మాలసం తయ్యెడిం.

వాసవ : ఎవరీతడు బాబయ్యా! తొలగిపొమ్మంటాడు.

యౌగం : మనలను గాదమ్మా! తన్నే ధర్మమునుంచి తొలగదోసుకొంటున్నా డీతడు.

వాసవ : నే నందుకనడంలేదు. నన్నుకూడా తొలగి పొమ్మంటున్నాడే అని.

యౌగం : నిన్నే కాదు తల్లీ! ఎరగనివాళ్లు దేవతలను గూడా అవమానిస్తారు.

వాసవ : మార్గాయాసంకంటెకూడా ఎక్కువ ఖేద పెట్టు తున్న దీ తిరస్కారము.

యౌగం : ఈ భోగాలన్నీ అనుభవించి విడిచిన తల్లివి, ఎందుకు విచారిస్తావు గనుక?

విభుడు గెలిచినంత వెండియు భాగ్యముల్
వలచు నిన్ను, జింత వలదు తల్లి!
క్రిందు మీదులగును స్యందనాంగపు టాకు
గమియు వోలె సిరులు గాలవశత.

భటులు: వెళ్ళిపొండయ్యా! వెళ్ళిపొండి.

కాంచుకీయుడు: (ప్రవేశించి) వెడలగొట్టకురా, సంభషక! వీరిని వెడలగొట్టకు.

పరిభవమున కోడి, పట్టనమ్ములు వీడి
కాననఁజేరినట్టి మానధనుల,
మునుల నిట్లుపరుషముగ నీవు నోనాడి
తెచ్చిపెట్ట కప్రతిష్ఠ బతికి.

భటు: చిత్తమండయ్యగారూ (నిష్క్రమింతురు)

యౌగం: ఈతడెవరో యోగ్యుడుగా కనిపిస్తున్నాడు. సమీపింతాముర అమ్మా.

వాసవ: మంచిది. పదండి.

యౌగం: (సమీపించి) అయ్యా! ఎందు కిట్లా వెళ్ళగొట్టుతున్నా రందఱిని?

కాంచు: ఓహో! ఋషీశ్వరులా!

యౌగం: (తనలో) 'ఋషీశ్వరులా' అనిఅంటూంటే, ఇంకా అలవాటు కాకపోవడంవల్ల నాకే కొత్తఅనిపిస్తున్నది.

కాంచు: మనవిచేస్తున్నాను. మా యేలినవారు దర్శక మహారాజులుంగా రన్నారే, వారితోబుట్టువు పద్మావతమ్మగారు, ఆశ్రమంలో వుంటున్న తమ తల్లిగారిని సేవించుకొని,

వారి అనుజ్ఞపొంది తిరిగి రాజగృహానికి విజయంచేస్తూ త్రోవలో ఇచట కొంచెం విశ్రమిస్తున్నారు. అంతేకాని,

ఎపుడు గుల్రవతమ్ముగ మునీశ్వర సేవలొనర్చుచుండు మా
నృపసుత ధర్మరక్త, కలనేని దలంచునె ధర్మపీడ ! మీ
రపగతభీతులై వనమునందు గ్రహింపఁగవచ్చు నిచ్ఛమై
తపసులు ! పూవులో, జలమొ, దర్భలొ, పర్ణములో, సమిత్తులో.

యౌగం : (తనలో) ఈమెయేనా, మగధ రాజపుత్రి, పద్మావతి ! ఈమెయే మా ప్రభువుకు ధర్మపత్ని అవుతుందని జ్యోతిష్కులు చెప్పారు. కనుకనే ఈ రాజపుత్రియెడల నా కింతటి అభిమానం కలుగుతూ వుంది. అవును, బహుమానంగాని ద్వేషంగాని మన సంకల్పాన్ని బట్టే కలుగుతూ వుంటవి.

వాసవ : (తనలో) రాచకూతురని వినగానే నా కేమో సోదరీ ప్రేమ కలుగుతున్న దీమెపట్ల.

(సపరివారయైన పద్మావతియు, చేటియు ప్రవేశింతురు.)

చేటి : దయచేయండి. చిన్నమ్మగారూ! ఇదిగో, ఆశ్రమానికి వచ్చాము.

(ఉపవిష్టయై తాపసి ప్రవేశించును.)

తాపసి : స్వాగతమా ? అమ్మా. రాజపుత్రీ !

వాసవ : ఎంత చక్కగావుంది, యీమెరూపం ! రాజపుత్రికే తగును.

పద్మా : అమ్మా ! నమస్కరిస్తున్నాను.

తాపసి : చిరంజీవ. రా అమ్మా ! రా. అతిథులకు స్వగృహంవంటి దీ తపోవనం.

పద్మా : అవునమ్మా! అవును. మనసు చల్లని మీ మాటలూ, మీ ఆదరం నన్ను ధన్యురాలిని చేస్తున్నవి.

వాసవ : (తనలో) రూపమే కాదు. ఈమె మాటకూడా ఎంతో మధురంగా వుంది.

తాపసి : అమ్మా! మీరేలినవారి యీ ముద్దుచెల్లెలి నింకా యేరాజకుమారుడూ వరించలేదటే?

చేటి : చిత్తం. ఉజ్జయినీప్రభువులు ప్రద్యోతమహారాజు లుంగారున్నారే, వారికుమారులకు, మా చిన్నమ్మగారి నడిగించారండి.

వాసవ : (తనలో) సరిసరి. ఇకనేమి, మాకు ఆత్మీయు రాలే అవుతున్నది.

తాపసి : బాగున్నది. ఈ బంగారుతల్లికి దగినసంబంధమే యది. వాసికెక్కిన యీ రాజకులాలు రెండూ వియ్యమందటం యెంతైనా తగివుంటుంది.

పద్మా : (కంచుకితో) అయ్యా! ఇచటి మునిజనుల కెవరి కేమికావాలో కోరుకొని నన్ననుగ్రహించవలసిందిగా మనవిచెయ్యండి.

కంచుకి : చిత్తం. అయ్యా! ఆశ్రమవాసులందరూ నా విన్నపమాలకించండి. మా మగధమహారాజులుంగారి అమ్మాయిగారిపట్ల మీరు చూపిన విశ్వాసంవల్ల కలిగిన విశ్వాసంకొద్దీ, ధర్మసంగ్రహార్థం ఆమె మిమ్మందరినీ పూజించ గోరుతున్నది.

కలశంబెవరికో, వస్త్రమెవ్వరికో, దీక్షాపూర్తిగావించి యు
జ్జ్వలకుఁ దక్షిణయీయఁగోరునెడఁ దత్సంకల్పమేలాటిదో
తెలుపుం డాశ్రమవాసులార! మిము సర్థిం దృప్తులంజేసి ని
ర్మలధర్మప్రియ మానృపాలసుత సంపాదించు ధన్యత్వముఁ.

యౌగం: (తనలో) మేలుమేలు. బాగున్నదీయుపాయం. (ప్రకాశం) ఇదిగో, నే నర్థిని.

పద్మా: నే నదృష్టవతిని. తపోవనానికి వచ్చిన రాక సఫలమయింది.

తాపసి: ఇచటి యాశ్రమవాసు లెవరికీ కోరికలు లేవే! ఇత డెవరో క్రొత్తవాడు కావలె.

కంచుకి: తమ కేమికావలెనో సెలవియ్యండి.

యౌగం.: ఇదిగో! ఈ చిన్నది నా తోబుట్టువు. భర్త నెడబాసియున్న యీమెను గొంతకాల మీ రాజపుత్రి చెంతనుంచి పోవాలని నా కోరిక. అంతేకాని–

పుట్టములేల, భాగ్యములు భోగములేటికి నాకు? పాపులఁ
గట్టుట పొట్టకోసరముకాదుసుడీ, నృపకన్య యెంతయుఁ
దిట్టయు, ధర్మశీలయని తెల్లముగాఁ గనుఁగొంటిఁగానఁ దోఁ
బుట్టిసదానిశీలమును బ్రోవఁగ నేర్పునటంచు వేఁడితిఁ.

వాసవ: (తనలో) ఇది యేమిటి! యౌగంధరాయణులు నన్నిచట దిగవిడిచి పోతామంటున్నారు! కానీ; ఆలోచించకుండా ఏపనీ చేయరు వారు.

కంచుకి: అమ్మా! వీరికోరిక వల్లమాలినదిగా వుంది. ఎందువల్లనంటే...

అర్థమీయవచ్చు, నసువుల నీవచ్చు
ధారవోయవచ్చుఁ దపములైన
అదియు నిదియునాక యన్నియు నిడవచ్చుఁ
గాని న్యాసరక్ష పూనరాదు.

పద్మా : అలా అనడం భావ్యంకాదు. మొదట కోరు కొమ్మని యిప్పుడెలా నిరాకరిస్తాం గనుక ? వారి అభీష్టం నెరవేర్చవలసిందే.

కంచుకి : చిత్తం. బాగా సెలవిచ్చారు.

చేటి : మా చిన్నమ్మగారు, యిలాగే అన్నమాట తప్ప కుండా వెయ్యేళ్లు వర్ధిల్లాలి.

తాపసి : నీకూ వెయ్యేళ్లే అమ్మా !

కంచుకి : తథాస్తు. (యౌగంధరాయణుని సమీపించి) మీ తోబుట్టువును చెంత నుంచుకుంటా మన్నారండీ మా రాజకుమార్తెగారు.

యౌగం : మహాప్రసాదం. (వాసవదత్తతో) వారి చెంతకు వెళ్ళమ్మా !

వాసవ : (తనలో) మందభాగ్యురాలను. ఏమి చేతును వెళ్ళక ?

పద్మా : రావమ్మా ! రా ! మా కాత్మీయవైనావు.

తాపసి : ఆకారంచూడగా రాచకన్నెగా కనిపిస్తున్నది.

చేటి : అమ్మగారు బాగా సెలవిచ్చారు. నాకు గూడా ఈ యమ్మగారు బాగా బతికినవారనే తోస్తున్నది.

యౌగం : (తనలో) అబ్బ ! ఇప్పటికి సగంబరువుతగ్గింది. మంత్రులతో ఆలోచించినట్లే జరిగింది. మాప్రభువు రాజ్య

ప్రతిష్ఠితులైనవిమ్మట, తిరిగి నేనీ దేవిని సమర్పించేటప్పు డీ మగధరాజపుత్రియే నామాటకు బూటగావుంటుందిగనుక భయములేదు. ఇంతకు,

తప్పదు మా నృపాలునకు దారయగున్ మగధేశకన్య; వా
తప్పునె సిద్ధవాక్యములు ధాతలిఖించిన వ్రాలు తప్పినన్;
జెప్పినయట్ల భూపతికిఁ జేటుఘటిల్లుట గంటిఁగాదె, యిం
కొప్పమి యేలగల్గుననియొప్పి యొనర్చితి నిట్టి కార్యమున్.

(ఒక బ్రహ్మచారి ప్రవేశించును)

బ్రహ్మ : (చూపు లాకసమున నిగిడ్చి) అబ్బో! మాగ్గా యాసానికి మధ్యాహ్నంకూడా తోడయింది. ఇప్పు డెక్కడ విశ్రమించేటట్లు? (పరిక్రమించి) ఇదిగో! ఈ ప్రదేశమంతా యేదో తపోవనంవలె కనిపిస్తున్నది.

వెఱలేనిచూడ్కి నెనరుచింద నిచ్చోట
లేళ్లు మచ్చికమీఱఁ గ్రేళ్లుఁదాటు
ఏపుగాఁ గూరిమిప్రోపునఁ బెరిగి కై
వ్రాలెఁ దరుల్ పుష్పఫలభరమున
ఉరుద్రాడు దామెనలెఱుఁగ కల్లదె చెర
లాడుచున్నది కరి యాలమంద
కనుజూపుమేర నెక్కడఁగన్న నాగేటి
కఱ్ఱు మోపెఱుఁగని కన్నెబీళ్లె
ఆజ్యగంధమ్ములం దాల్చినట్టి ధూమ
వల్లరులు మింట నలుదెస నల్లుకొనుచు
ముకుపుటము దన్నెః నిద్ది తపోవనమ్మె
యగును ముమ్మాటికిని సందియమ్ము లేదు.

ప్రవేశిస్తాను. (ప్రవేశించి కంచుకిని గాంచి) ఆశ్రమ విరుద్ధమైన వేషంతో యీాయ నెవ రిచ్చట! (మఱియొక దిక్కు జూచి) ఇదిగో! ఇక్కడ జడదారులూ వున్నారు. తప్పులేదు. సమీాపిస్తాను. (సమీాపించి చూచి) ఓహో! ఎవరో స్త్రీలుకూడా వున్నారే!

కంచు: రండి. సందేహిస్తారేమి? తపోవనంలోకి అందరూ రావచ్చును.

వాసవ : అయ్యో! పరపురుషులు.

పద్మా : (తనలో) నయమే. పరపురుషుల కంట బడడానికి సంకోచిస్తున్న, దీయమ్మను గాపాడడం కష్టంకాదు.

కంచు : మేమిక్కడికి ముందుగా వచ్చాముగనుక మీారు మా కతిథులు. మా సత్కారం గ్రహించండి.

బ్రహ్మ : మంచిది. (ఆచమించి) నా ఆయాసం తీరిపోయింది.

యౌగం : ఏవ్వూరు నాయనా! మీాది? ఎక్కడ నుంచి వస్తున్నావు? ఎందాకా వెళ్లుతున్నావు?

బ్రహ్మ : మాది రాజగృహం కాపురమండీ. వేదాధ్యయనం కోసమని వత్సదేశంలో లావాణకమనే గ్రామంలో వుంటున్నాను.

వాసవ : (తనలో) అయ్యో! లావాణకం పేరువినగానే నాకు మళ్ళా దుఃఖం పొర్లుకువస్తున్నది.

యౌగం : అధ్యయనం పూర్తిఅయిందా?

బ్రహ్మ : ఏదీ, యింకా పూర్తికాలేదు.

యౌగం : అదేమి ! చదువుపూర్తిచేసుకోకుండా ఎందుకు బయలుదేరి వచ్చావు ?

బ్రహ్మ : అక్కడ గొప్ప విపత్తొకటి తటస్థించిందండీ !

యౌగం : చెప్పవూ ! ఏమిటా విపత్తు ?

బ్రహ్మ : అక్కడ ఉదయనులనే ప్రభువు వుంటూ వచ్చారు.

యౌగం : ఔనౌను. ఉదయనులవారిని గూర్చి వింటున్నాము. వారి కేమి జరిగింది?

బ్రహ్మ : అవంతీశ్వరుల కుమార్తె వాసవదత్తాదేవి ఆయనరాణి. ఆ దేవియంటే ప్రాణమే ఉదయనులవారికి.

యౌగం : కావచ్చును.

బ్రహ్మ : ఉదయనులవారు వేటకు వెళ్ళారొకనాడు. ఆ సమయంలో గ్రామం పరశురామప్రీతి కావటం, వాసవదత్తాదేవి ఆ మంటలలో దగ్ధంకావటం జరగింది.

**వాసవ :** (తనలో) వట్టిది, వట్టిది. మందభాగ్యను నేను జీవించియే వుంటినిగా.

యౌగం : తరువాత నేమిజరిగింది ?

బ్రహ్మ : రాణిని రక్షించబోయి యౌగంధరాయణులనే మంత్రికూడా ఆ మంటలలోబడి కాలిపోయినాడు.

యౌగం : ఆలాగునా ! ఎంతమాట ! తరువాత ?

బ్రహ్మ : తరువాత రాజుగారు వేటనుంచి తిరిగి వచ్చి యీ ఘోరవృత్తాంతం వినటం, ఆ దేవి నెడబాసి బ్రదుకలేనంటూ ఆ మంటల్లో పడబోవటం, మంత్రు లంతా అతియత్నంమీద మాన్పటం జరిగింది.

వాసవ : (తనలో) అవురవురా! ఆర్యపుత్రులు నా కోసం ఎంత విలపించిచారో.

యౌగం : నాయనా ! తరువాత నేమయింది ?

బ్రహ్మ : మంటలో కాలగా మిగిలిన ఆ దేవి ఆభరణాలు దొరికితే వాటిని కౌగిలించుకొని ఆ రాజు మూర్ఛపోయినాడు.

అందఱు : అయ్యో ! పాపం !

వాసవ : (తనలో) యౌగంధరాయణుల కోరిక తీరిందిప్పటికి.

చేటి : చిన్నమ్మగారూ! ఈ యమ్మ దుఃఖిస్తున్నా రండీ!

పద్మా : పాపం. జాలిగుండె యీమెది.

యౌగం: అవునమ్మా! అవును. మొదటినుంచీ వట్టి జాలిగుండెది నా చెల్లెలు, నాయనా! తరువాతి సంగతి చెప్పవూ!

బ్రహ్మ : ఆనక కొంతసేపటికా ప్రభువుకు తెలివివచ్చింది.

పద్మా : (తనలో) పోనీ పాపం. మూర్ఛిల్లా రని వినగానే నా హృదయం శూన్యమై పూరకొంది.

యౌగం : ఆనక ఏమయింది ?

బ్రహ్మ : నేలమీద పొరలాడడంవల్ల దుమ్ము గొట్టుకున్న శరీరంతో ఆ ప్రభువు లేచి, "అయ్యో ! దేవీ! అవంతి రాజపుత్రీ! నెచ్చెలీ! వాసవదత్తా! నా ప్రియశిష్యురాలవు, ఏమైనావు" అంటూ, పరిపరివిధాల వాపోయినారు.

కువకువ పెంటికై పొగులుకోకములన్ వినమో, ప్రియావియో
గవశత నార్తులౌ మగలఁగాంచమొ, శోకములట్టు లౌనొకో ;
ధవునకు నట్లుగూర్చు నలతన్వియె ధన్యయటన్న, భర్తృగౌ
రవమునఁజేసి, అగ్నిశిఖ్రమగ్గియు నాసతి మ్రగ్గదేకదా ;

యౌగం : అయితే, నాయనా! ఆస్థితిలో వున్న ప్రభువును మంత్రు లెవ్వరూ ఓదార్చనేలేదా?

బ్రహ్మ: ఓదార్చ కేమండీ. పాపం, ఋమణ్వంతుడనే మంత్రి చేయగల వుపచారాలన్నీ చేస్తూనేవున్నాడు.

రాలెడి బాష్పధారకు విరామములేక, శరీరసంస్క్రియల్
చాలక, అన్నపానములు సైపక, పాలిన చెక్కుటోయితోఁ
దూలినమేనితో, నృపునితోడిద నాఁబ్రదుకంచు మంత్రియున్
రేలుబవళ్లు దా నుపచరించుఁ బతిన్ సమదుఃఖభాగియై.

వాసవ: (తనలో) అమ్మయ్య. ఆర్యపుత్రుల కిక భయం లేదు.

యౌగం : (తనలో) పాపం. ఋమణ్వంతునిపై ఎంత భారం పడింది!

తేని బరువెల్లఁ దనమీఁద నూనియున్న
వానిదే భారసర్వస్వవహనమన్న;
నా బరువు సర్వ మాఋమణ్వంతుఁజేరెఁ
దెలిపి నా కబ్బెఁ: నాడ దూపిరి యతనికి.

(ప్రకాశం) నాయనా! ఆప్రభు వీపాటికి గుదుటబడి యుందునా?

బ్రహ్మ: ఏమో? నేనుమాత్ర మెఱుగుదునా? ఆప్రభువు "ఇదిగో ఇక్కడ మేమిద్దఱం నవ్వుకొన్నాము. ఇక్కడ ముచ్చటలాడుకొన్నాము. ఇక్కడ కూర్చున్నాము. ఇదిగో, ఇక్కడే మే మలిగాము. ఇక్కడ శయనించా"మంటూ దేవిని తలచుకొని విలపిస్తూవుంటే, మంత్రులంతా పట్టుబట్టి, అతియత్నంమీద ఆగ్రామంనుంచి తరలించుకు వెళ్ళారు.

ఆరాజు వెళ్ళిపోగానే చంద్రుడూ చుక్కలూ లేని ఆకాశం వలె ఊరంతా చిన్నబోయింది. అంతట నేనూ బయలుదేరి చక్కా వచ్చాను.

తాపసి : పొరుగూరివాడవు, నువ్వు కూడా ఇంతగా పొగడుతున్నావు. ఎంత గుణవంతుడో ఆరాజు!

చేటి : చిన్నమ్మగారూ! ఆమహారాజు మళ్ళా యెవ్వరిని చెట్టబట్టుతారో?

పద్మా: (తనలో) నామనసులో మాటే అడుగుతున్న దిది.

బ్రహ్మ : నాకిక సెలవిప్పించండి. వెళ్ళివస్తాను.

కంచుకి :
యౌగంధ: } మంచిది, నాయనా! నీపని నెరవేర్చుకో.

బ్రహ్మ : చిత్తము. (నిష్క్రమించును.)

యౌగం: మీరాజపుత్రి సెలవిప్పిస్తే నేనూ వెళ్లివస్తాను.

కంచుకి : వీరు తమ సెలవైతే వెళ్లుతామంటున్నారు.

పద్మా : వెళ్లితే బెంగపెట్టుకోదుగదా, వారిచెల్లెలు?

యౌగం : తమవంటి సాధువుల అండనున్న నాచెల్లెలి కింకా బెంగ యెందుకు తల్లీ! (కంచుకితో) అయ్యా! సెలవు పుచ్చుకొంటాను.

కంచుకి : తిరిగి దర్శన మిప్పిస్తారుగా తమరు?

యౌగం: చిత్తము.

(నిష్క్రమించును.)

కంచుకి : అమ్మా! మనకూ లోపలికి వెళ్లేవేళయింది.

పద్మా : అమ్మా! నమస్కరిస్తున్నాను.

తాపసి : నీకు దగిన భర్త లభిస్తాడు తల్లీ !

వాసవ: అమ్మా! నాకుగూడా అనుజ్ఞ.

(నమస్కరించును.)

తాపసి : మంచిదమ్మా! తిరిగి త్వరలోనే భర్తను చేరుకొంటావు.

వాసవ : తమ అనుగ్రహం.

కంచుకి : దయచేయండమ్మాయిగారూ! ఇలా రండి. అమ్మా! రండి. అదిగో!

సంధ్యాకషాయితసలిలావగాహమ్ము
సల్పఁజొచ్చిరి కావిదాల్పులెల్ల
అపరసంధ్యాముఖాభ్యర్చనల్ గొనుపొంటె
హవ్యవాహనుఁడు సప్తార్చి వెలిఁగె
కలకలారావసంకులముగా బారులు
గట్టి గూండ్లకుఁజేరు ఖగకులమ్ము
హోమధూమాంబుదస్తోమ మాశ్రమవృక్ష
నిశ్రేణికలమీఁద నింగి ప్రాకె
రవియు దౌదౌల సంక్షిప్తరశ్మియగుచుఁ
జిలుకవన్నియయేడుతేజీలతోడి
తేరు నిలబెట్టి తా దిగజారె ననఁగ
నల్లనల్లనఁ జేరె నస్తాద్రిశిఖరి.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

# ద్వితీయాంకము

(చేటి ప్రవేశించుచున్నది)

కుంజరికా! కుంజరికా! చిన్నమ్మగా రెక్కడున్నారే? (చెవియొగ్గి) ఏమిటీ? బంతి ఆడుతున్నారా? యెక్కడ? ఈ మాధవీలతామంటపం దగ్గిరేనా, సరే. సమీపిస్తాను. (పరిక్రమించి, చూచి) అదిగో! బంతియాడుతూ చిన్నమ్మగా రిలాగే వస్తున్నారు. చెదరిపోయిన ఆ చెవిజంపూ, చెమటబొట్లతో తళతళలాడుతూ సొంపులొలికే ఆముఖమూ ముద్దువస్తున్నారు చిన్నమ్మగారు. సమీపిస్తాను.

(నిష్క్రమించును.)

(ఇది ప్రవేశకం)

(బంతియాడుతూన్న పద్మావతి, వాసవదత్తతో సపరివారయై ప్రవేశించును)

వాసవ : ఇదిగోనమ్మా! మీ బంతి.

పద్మా : ఉండనివ్వండి? ఆట చాలు నిప్పటికి.

వాసవ : చూచారూ? ఇంతసేపూ బంతి ఆడడంవల్ల, కెంపులోడుతూన్న యీ హస్తాలు మీవా, మరొకరివా అని పిస్తున్నవి!

చేటి : ఆడుకోండి, చిన్నమ్మగారూ! కన్నె వయసులోనే గా యీముచ్చట లన్నీ. ఆడుకోండి.

పద్మా : (వాసవదత్తతో) ఏమిటండీ, ఆలా నవ్వుతూ చూస్తున్నారు నావంక?

వాసవ : లేదమ్మా. సవ్వడంలేదు. ఇవ్వాళ్ళ మఱీ ముద్దు వస్తూన్న నీ నెమ్మోము పరికించి చూస్తున్నాను.

పద్మా : మీ పరిహాసాలు చాలింతురూ ఇంతట.

వాసవ : చిత్తం. మహాసేనులకోడలి యాజ్ఞ మీరటమే!

పద్మా : మహాసేను లెవరండోయి ?

వాసవ : ఉజ్జయినీప్రభువు ప్రద్యోతులవారి నెఱుగరూ? అంతులేనిసేన లుండటంవల్ల మహాసేనులంటారు వారిని.

చేటి : మా చిన్నమ్మగారి కాసంబంధ మిష్టంలేదండీ.

వాసవ : మఱి యెవరి సంబంధ మిష్టమో ?

చేటి : వత్సరాజుగారు లేరండీ, ఉదయనులవారు. వారి గుణాలు విని వలచారండీ చిన్నమ్మగారు.

వాసవ: (తనలో) ఆర్యపుత్రుల నే వలచిందీబిడ! (ప్రకాశం) ఎందువల్లనో ?

చేటి : చాలా దయగలవారని.

వాసవ : (తనలో) అవునవును. నాకు ఎత్తిన వలపు వెఱ్ఱి అందుకేగదా.

చేటి : ఔనుగానండి, చిన్నమ్మగారూ! ఆదొరగారు చక్కనివారు కాకపోతేనో ?

వాసవ : కాకపోవడమేమి ! చాలా చక్కనివారు.

పద్మా : అమ్మా! మీరెలా యెఱుగుదురు వారిని ?

వాసవ : (తనలో) ఔరౌర ! ఆర్యపుత్రులమీది పక్షపాతంచేత తీరా నోరు జారింది. ఏమిచేతును ? కానీ, ఇలా అంటాను. (ప్రకాశం) ఉజ్జయినీ ప్రజలు చెప్పుకోగా విన్నానమ్మా.

పద్మా: అవును. ఉజ్జయినీప్రజలు వారిని చూచే వుంటారు. రూపసంపద అందరినీ లోగొంటుందిగదా.

(ధాత్రి ప్రవేశించును.)

ధాత్రి : శుభం. చిన్నమ్మగారూ! శుభం. మిమ్మ నిచ్చివేసారు.

వాసవ : ఎవరి కిచ్చారమ్మా? ఎవరికి?

ధాత్రి : వత్సరాజు, ఉదయనులవారికి.

వాసవ : ఆప్రభువుకు కుశలమేనా అమ్మా?

ధాత్రి: ఆహా!వారు కుశలంగానే దయచేసారు. చిన్నమ్మ గారిని స్వీకరించారు.

వాసవ : ఔరౌర! ఎంతచేటు!

ధాత్రి: ఇందులో చేటేమిటండీ! అలా అన్నారు.

వాసవ : అంతగా దుఃఖించినవా, రింతలో ఉదాసీనులైనారుకదా అనుకొన్నానేకాని మరేమీ లేదు.

ధాత్రి : ఆలాకాదండమ్మగారూ! గొప్పవారి మనస్సులు ఆగమప్రధానములు కావడంవల్ల అంతలో కుదుటబడుతవి.

వాసవ : అయితే వారే స్వయంగా వరించారుకాబోలు నేమమ్మా?

ధాత్రి : లేదండీ. వేఱేపనిమీద యిక్కడికి దయచేసారా ప్రభువు. వారివంశగౌరవమూ, ప్రజ్ఞావయోరూపాలూ నచ్చి మా మహారాజులుంగారే యిచ్చారీతల్లిని.

వాసవ : (తనలో) అయితే ఆర్యపుత్రులదోషం లేదిందులో.

(మఱియొక చేటి ప్రవేశించును.)

చేటి : వేగిరం రండి. అమ్మాయిగారూ! వేగిరం రండి. ఇప్పుడే సుముహూర్తమట. పెండ్లికూతురును చెయ్యడానికి అమ్మగారు తొందరపడుతున్నారు.

వాసవ : (తనలో) ఔరా! వీరి తొందరతో నా హృదయాన చీకట్లు క్రమ్ముకొంటున్నవి.

ధాత్రి : దయచేయండి. చిన్నమ్మగారూ!

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము

# తృతీయాంకము

(వాసవదత్త చింతిస్తూ ప్రవేశించును.)

అంతఃపురచతుశ్శాలలో, పెండ్లి సందడిలో వున్న పద్మావతిని వదలి, యిలా ప్రమదవనంలోకి వచ్చాను: నావంతుకు వచ్చిన దుఃఖాన్ని యిక్కడ దిగమ్రింగుకో వచ్చునని. (పరిక్రమించి) ఎంతకష్ట మెంతకష్టం! ఆర్య పుత్రులుకూడా యిలా పరస్త్రీపా లయిపోయినారే! ఇక్కడ కొంచెం విశ్రమిస్తాను. (కూర్చుండి) జోడు నెడ బాస్తే బ్రదుకదట జక్కవ పెంటి, ఎంత ధన్యురాలో! నే నీ ప్రాణాలు విడువలేకుండా వున్నాను. ఏదిలేకపోయినా ఆర్య పుత్రులను చూస్తూవుండవచ్చును గదా అనే మనోరథంతో ఈ పాడుబ్రతుకు భరిస్తున్నాను.

(పూవులనుగైకొని చేటి ప్రవేశించును.)

చేటి : అవంతికమ్మగారెలా వెళ్లారో కనిపించలేదు. (పరిక్రమించి చూచి) ఇదుగో! ఈ ప్రియంగు వృక్షం క్రింద రాతిపలకమీద కూర్చున్నారీమె; ఏదో వలవంత వెళ్ళబోసుకుంటూ. తోడనులు లేకపోయినా, మంచుగప్పిన చంద్రరేఖవలెవున్న యీయమ్మరూపం కన్నులు చల్లబరుస్తున్నది. దగ్గఱకు వెళ్లుతాను. (సమీపించి) అవంతికమ్మగారూ! మీకోసం ఎంతసేపటినుంచి వెదుకుతున్నానండీ!

వాసవ : ఎందుకు ?

చేటి : "అవంతికమ్మ గొప్ప యింటి పడుచు, నెయ్యమూ నేర్పూ గలది, కౌతుకమాల ఆమె గుచ్చితే బాగుంటుం"

దని సెలవిచ్చారు, మాదొరసానిగారు.

**వాసవ** : ఎవరికోసమే యీమాలిక ?

**చేటి** : మాచిన్నమ్మగారికే నండి.

**వాసవ** : (తనలో) ఈ పనికూడా నావంతుకే రావలెనా! దేవతల కెంత పగదాన నైనానో.

**చేటి**: అమ్మగారూ! మీరేదో ఆలోచిస్తూ వూరకొంటే యెలాగండీ ? ఓ చెంప అల్లుడు గారప్పుడే మణిభూమియందు మంగళస్నానం చేస్తున్నారాయె. త్వరగా గుచ్చండి మాలిక.

**వాసవ** : (తనలో) ఆలోచించడానికి అర్హతెక్కడిది నాకు ? (ప్రకాశం) ఓసీ! అల్లుడుగారిని చూచావటే నీవు?

**చేటి** : చూచానమ్మగారూ! చిన్నమ్మగారిమీది నెయ్యం చేతనూ, నా అంతట నాకే చూడాలనే కోరికచేతనూ కూడా చూచానండి.

**వాసవ** : ఎలా వున్నా రల్లుడుగారు ?

**చేటి** : ఎలావున్నారని చెప్పమంటారు! అంతచక్కదన మెక్కడా చూడలేదండీ.

**వాసవ** : చెప్పవేమి మఱి,అంత చూడ చక్కనివారటే!

**చేటి** : అది చక్కదనమంటే చక్కదనమాండి! విల్లూ, అమ్ములూలేని మన్మథు లేనండీ.

**వాసవ** : సరేగాని ఇక నంతట జాలించు.

**చేటి** : ఆలా చాలించమంటి రేమండీ, అమ్మగారూ!

**వాసవ** : దోషంకాదటే, పరపురుషకీర్తనం అలా వినకూడదు.

**చేటి** : అయితే వేగిరం దండగుచ్చండి.

వాసవ : ఏవీ, ఆపూవు లిలాయివ్వు.

చేటి : ఇవిగోనండి.

వాసవ : (పూవులు పుచ్చుకొని, చూచి) ఇందులోవున్న యీ ఓషధియేమిటే?

చేటి : అది అవిధవాకరణమం డమ్మయ్యగారూ!

వాసవ : (తనలో) అయితే నా కోసం, పద్మావతికోసం కూడా గుచ్చవలసిందే యిది. (ప్రకాశం) మరి యీ ఓషధి యేమిటే ?

చేటి : అది సపత్నీమర్దనమండి.

వాసవ : అయితే గుచ్చనక్కఱలే దది.

చేటి : ఎందువల్ల నమ్మగారూ?

వాసవ : వారి భార్య కాలంచేసిందికాదటే, అందువల్ల అక్కఱలేదన్నాను.

(ఇంకొక చేటి ప్రవేశించును)

చేటి : అమ్మగారూ! వేగిరం కానివ్వండి. ముత్తైదువలప్పుడే పెండ్లికుమారుణ్ణి లోపలిలోగిట్లోకి తీసుకవచ్చారు.

వాసవ : ఇదిగో, తీసుకువెళ్ళు.

చేటి : మేలు. అమ్మగారూ! మేలు. వెళ్లివస్తామండి.

(ఉభయులు నిష్క్రమింతురు)

వాసవ : అయ్యో! తీసుకుపోయింది. ఇంకేముంది! ఆర్యపుత్రులు పరులపాలై పోయినారు. ఇక పోయి పండుకొనైనా పండుకొంటాను. నిద్రపట్టితేనైనా యీ దుఃఖం చల్లారుతుం దేమో. (నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.

# చతుర్థాంకము

(విదూషకుడు ప్రవేశించును)

(సహర్షం) దైవానుగ్రహంవల్ల మళ్లా మాకు శుభకాలంవచ్చి, మా వత్స రాజులుంగారి వివాహమంగళోత్సవం కంటబడింది. విపత్పరంపర లనే సుడిగుణ్ణాలలోబడి కొట్టుకు పోతూన్న మేము మళ్లా యిట్లా పైకి తేలుతామని యెవరనుకొన్నారు. ఈ రాజప్రాసాదాలలో నివాసం, రాణివాసపు గోలకులలో యీ స్నానాలూ, మెత్తమెత్తని తీయతీయని యీ మోదకాలు కడుపార మెక్కటం. ఇదంతా చూడగా, అప్సరసలులేని లోటొక్కటి తప్పితే, అంతా స్వర్గభోగంగా వుంది. కాకపోతే ఒక్కచిక్కువచ్చి పడ్డది. ఏమిటంటే, తిన్నతిండి తిన్నగా జీర్ణంకావడంలేదు. ఏమి పాపమో! ఎంతమెత్తని శయ్యలమీద పడుకొన్నా కంటికి కూరుకన్న మాటలేదు. ఒళ్ళంతా వాతరక్తం వ్యాపించి, కాళ్ళు ఒకటే నొప్పులు, కదలనివ్వవు. అబ్బ! రోగాలూ, నొప్పులూ లేక వేళకింత చలిదియన్నం దొరకిందే సుఖమంటే.

(చేటి ప్రవేశించును)

చేటి: వసంతకయ్య ఏమయిపోయినాడో, కనిపించలేదు. (పరిక్రమించి చూచి) అదుగో! అక్కడ. (సమీపించి) వసంతకయ్యా! ఎంతసేపటినుంచి వెతుకుచుంటినయ్యా. నీకోసం.

వసం: ఏమికధ? నన్ను వెదకడమెందుకు?

చేటి : దొరసానమ్మగా రడగమన్నారు - అల్లుడుగారు స్నానం చేసారో లేదో.

వసం : ఏమిపని వచ్చింది **వారితో** ?

చేటి : వారికి అనులేపనద్రవ్యాలు తీసుకరావడానికి.

విదూ: అందుకా! వారు స్నానంచేసారుగాని భోజనం తప్ప మిగతావన్నీ తీసుకురా, పో.

చేటి : భోజనం వద్దంటూ రెందువల్ల ?

విదూ : ఎందువల్లనా ? నిర్భాగ్యుణ్ణి. కోకిలకు కనుగ్రుడ్లు తిరిగినట్లుగా నాకు కడుపులో త్రిప్పడం మొదలుపెట్టింది.

చేటి : అంతే కావాలి నీకు.

విదూ : సరేలే. నువ్వుపద. నేనూ ఏలినవారి చెంతకు వెళ్ళుతాను. (నిష్క్రమింతురు.)

ఇది ప్రవేశకం

(సపరివారయైన పద్మావతీ, అవంతికావేషంతో వాసవదత్తా ప్రవేశింతురు.)

చేటి: చిన్నమ్మగారూ! ప్రమదవనంలోకి వచ్చారెందుకు?

పద్మా : ఇవిగో! ఈ శేఫాలికలు పూచినవో, లేదో చూద్దామని.

చేటి : పూచాయి చిన్నమ్మగారూ ! చూడండి. పగడపు బూసలు గుచ్చిన ముత్యాలచేరులవలె ఎలా వున్నవో, పూవులు !

పద్మా : అయితే మఱి ఆలస్య మెందుకు ?

చేటి: ఈ చలువరాతిపలకమీద కొంచెం విశ్రమించండి. నే నీలోపల పూలుకోసుకు వస్తాను.

పద్మా : ఏమమ్మా ! ఇక్కడ కూర్చుందామా !

వాసవ : అలాగే కూర్చుందాము.

(ఉభయులు కూర్చుందురు.)

చేటి : (పూవులు తెచ్చి) చూడండి. చిన్నమ్మగారూ! మణిశిలపలుకులవలె యెలావున్నవో యీ పువ్వులు నా దోసిట్లో !

పద్మా : (చూచి) చూడవమ్మా, చూడు. చిత్రవర్ణములైన యీపూవు లెంత బాగున్నవో !

వాసవ: అవునవును. ఎంతో చూడ ముచ్చటగా నున్నవి.

చేటి : ఇంకా కోసి తెమ్మంటారా? చిన్నమ్మగారు.

పద్మా : వద్దు వద్దు. ఇక కోయబోకే.

వాసవ : వద్దంటా రెందువల్ల ?

పద్మా : ఆర్యపుత్రు లిలా వచ్చినప్పు డీపుష్పసమృద్ధి చూస్తే ఎంతో మెచ్చుకొంటారుగదా అని.

వాసవ : భర్తగారిపై ఇష్టమేనా అమ్మా, నీకు ?

పద్మా : ఏమోనమ్మా, నాకేమీ తెలియదు. వారిని విడిచి ఒంటరిగా వుంటేమాత్రం నాకెలాగో వుంటుంది.

వాసవ : (తనలో) ఊరకుండలేక అడిగి, ఈ యప్రియం చెప్పించుకొన్నాను.

చేటి : భర్తగారంటే తనకు ప్రీతేనని చిన్నమ్మగారు ఎంత చక్కగా చెప్పింది !

పద్మా : నాకొక్క సందేహం మాత్రం వుంది.

వాసవ : ఏమి టేమి టది !

పద్మా : భర్తగారు నాకెంత ప్రియులో, వాసవదత్తా

దేవికిగూడా అంతప్రియులేనా అని.

వాసవ : నీకంటెగూడా ఎక్కువే ఆమెకు.

పద్మా : మీరెలా యెఱుగుదురు!

వాసవ : (తనలో) ఆర్యపుత్రులమీది పక్షపాతంకొద్దీ నోరు జారాను. ఇప్పుడేమిచేతును? ఇలా అని చూస్తాను. (ప్రకాశం) ఎంతప్రీతీ వుండకపోతేనే స్వజనాన్ని విడిచి ఆలా వెంటవస్తుందా ఆమె?

పద్మా : అవునవును.

చేటి : అయితే చిన్నమ్మగారూ! మీకుగూడా వీణ నేర్పండని అడగరాదూ, దొరగారిని.

పద్మా : ఈవఱకే అడిగానే.

వాసవ : అడిగితే ఏమన్నారు వారు?

పద్మా : ఏమీ బదులుచెప్పక ఒక్కనిట్టూర్పు విడిచి వూరకొన్నారు.

వాసవ : అప్పుడేమనుకున్నారు మీరు?

పద్మా : వాసవదత్తాదేవి గుణాలు తలచుకొంటూ, దాక్షిణ్యంకొద్దీ, నాయెదుట విలపించక ఊరకున్నారనుకొన్నాను.

వాసవ : (తనలో) ఇదే నిజమైతే నాకంతే చాలు.

(అంతట రాజూ విదూషకుడూ ప్రవేశింతురు.)

విదూ : హాహాహా! పూలకోతలో బలచపలచగా రాలి పడిన యీ బంధుజీవపుష్పాలతో ఎంత సొంపుగావుందో ప్రమదవనం చూచారూ?

రాజు : ఇదిగో! వస్తున్నాము.

కంటికివిం దవంతిసుత గన్గొని చొక్కినవాడె తూపులై
దింటి మరుండు నాపెనుగదే యెదగాడ; సశల్యమైనయా
పుంటిపయిన్ మఱొక్క శరమున్ వెసనాటెను నేడు, మారునిన్
వింటిని పంచబాణుఁడని వీఁడెట నాఁటివతూపు దెబ్బనో!

విదూ : పద్మావతీదేవి కనిపించ దే ఏమయినట్లు? ఈలతా మంటపంలో వున్నదా? ఏదీ అసనకుసుమాలు రాలటం చేత పులిచర్మం పరచినట్లుండే పర్వతతిలకమనే ఆ శిలా ఫలకంమీద ఉందేమో? మత్తే. యీ యేడాకుల అరటి తోటలో విహరించడం లేదుగదా? అన్నట్లు, మృగపక్షి చిత్రసంకులమైన దారుపర్వతకంమీద వుంటుంది. (ఆకస ముపై దృష్టినిగిడ్చి) ఆహాహా! చూడండి! శరత్కాల నిర్మలమైన ఆకాశంమీద ఎగిరిపోయే ఆ బెగ్గురులబారు చూచారా, ఎలా వుందో బలరాములవారు సాచిన బాహువు లాగ!

రాజు : నిజమే సుమా!

బశిరా : కూసమునూడ్చుపాముపగిదిన్ భాసిల్లు నాకాశవీ
ధులకున్ హద్దులుదిద్దు బెగ్గురులపంక్తుల్ తిన్ననై, అంతలోఁ
బలుచంబాఱుచుఁ గ్రిందికిం బయికి విల్వంపొచు, సప్తర్షిమం
డలవక్రమ్మగ మల్పులన్ దిరుగుచున్ గన్పట్టుఁ గన్విందులై,

చేటి : అవిగవిగో! బెగ్గురుపక్షులుచూడండి, చిన్నమ్మ గారూ! తెల్లగా కలువపూదండవలె ఆకాశాన ఎలా బారు గట్టిపోతున్నవో! అమ్మో! దొరగారు!

పద్మా : అరుగో! ఆర్యపుత్రులే! ఏమి చేతును? (వాసవదత్తతో) మీరు చెంతనుండగా ఎలా యెదుట

బడడం? రండి, ఈమాధవీలతా మంటపంలోనికి వెళ్లుదాము.

వాసవ : పదండి, వెళ్లుదాము. (అట్లుచేతురు.)

విదూ: ఇదిగో! పద్మావతీదేవి యిలావచ్చి వెళ్లినట్లున్నది.

రాజు : ఎలా తెలిసింది నీకు ?

విదూ : ఇవిగో ! పూవు లూడ్చిన యీ శేఫాలికలు చూస్తే మీకు తెలియడంలేదూ ?

రాజు : (శిలాఫలకమును స్పృశిస్తూ) ఔను, నీ వన్నదినిజమే!

ఇదె : కదుష్ణమైన దీ శిలాఫలకమ్ము,
ననలు బాదహతుల నలఁగిపోయె
నిచట విశ్రమించి, యింతంత మము గాంచి
ఇంతియెవరొ దొలఁగియేగె నిజము.

వసంతకా! ఈ వన్నెవన్నె పువులు చూచావా, ఎంత యింపుగా నున్నవో!

వాసవ . (తనలో) వసంతక అనేమాట వినేసరికి మళ్లా ఉజ్జయినిలో వున్నానా అనిపిస్తున్నది.

రాజు : దేవి వచ్చేవఱకు ఈ రాపలకమీదనే కూర్చుందాము.

విదూ : అలాగే (కూర్చుండి లేచి) అబ్బ! ఈ శరత్కాలపు ఎండలో ఇక్కడెందుకుగాని ఆమాధవీమంటపంలో చల్లగా వుంటుంది పదండి.

రాజు : మంచిది నడువు.

విదూ : దయచేయండి. (ఉభయులు పరిక్రమింతురు.)

పద్మా : చెఱపనచేట ఈ వసంతకయ్య ఎప్పుడూ ఇంతే. ఇప్పుడేమి చేతును ?

చేటి : చిన్నమ్మగారూ! నే నొక ఉపాయంచెయ్యనా? ఇదిగో! తుమ్మెదలు మూగిన యీ తీగెకదిపి తుమ్మెదల్ని రేపుతాను, దొరగారు లోపలికి దయచేయుదురుండా.

పద్మా : కానీ. (చేటి అట్లు చేయును.)

విదూ : అమ్మో! అక్కడో, అక్కడో ఆగండి మీరు.

రాజు : ఏమిటది?

విదూ : ఏమిటా? ఈ తుమ్మెద తొత్తుకొడుకులు ముసురుకొని చంపేస్తున్నారు.

రాజు : ఇంతే కదా. పాపం. వాటిని భయపెట్టి పార దోలకు.

కుత్తుక బంటిగా మధువుఁగ్రోలిన యన్నున గండుతుమ్మెదల్
చిత్తజతాపతప్తలగు చెల్వల గుత్తపుఁ గౌఁగిలింతలన్
మత్తిలియుండఁ, దత్సుఖసమాధికి భంగమొనర్చి, కాంతతోఁ
బొత్తెడబాసి కుందుమముబోలు నవస్థ ఘటింపఁబోకుమీ.

విదూ : పోనీండి. మీ యిష్టం. (ఉభయులు గూర్చుంటారు)

చేటి : చిన్నమ్మగారూ! మనమీ చెఱలో చిక్కుకున్నామండి.

పద్మా : అమ్మయ్య, బ్రతికితిమి. ఆర్యపుత్రు లచటనే ఆసీనులైనారు.

వాసవ : (తనలో) ఆర్యపుత్రులు స్వస్థదేహులై మళ్ళా కంటబడ్డారు.

చేటి : చిన్నమ్మగారూ! ఈ యమ్మ కంట నీరు బెట్టుకొంటున్నారండి.

వాసవ : ఇదిగో! ఈపాడు తుమ్మెదల మూలాన రెల్లు పూరేణువులు కంటిలో బడినవి. అంతకంటె మరేమీ లేదు.

పద్మా : కావచ్చునమ్మా.

విదూ : ప్రమదవనంలో ఎక్కడా అలికిడి లేదుగాని మిమ్ము నొక్క ప్రశ్న అడగాలనివుంది. అడగనా ?

రాజు : అడుగు. నీ కడ్డమేమిటి ?

విదూ : మరేమీ లేదుగాని, అప్పటి ఆ వాసవదత్తా దేవి మీద మీ కెక్కువయిష్టమా ? ఇప్పటి యీ పద్మావతీ దేవిమీదనా ? ఈ ఒక్కమాటా చెప్పండి. చాలును.

రాజు : ఎందుకు మమ్మిబ్బంది పెట్టుతావు, పోనిద్దూ.

పద్మా : ఆర్యపుత్రులకు చెడ్డ సంకటం కల్పించావు, వసంతకయ్యా.

వాసవ : (తనలో) మందభాగ్యురాలికి నాకుగూడాను.

విదూ : భయంలేదు, చెప్పండి ఒకరు కాలంచేశారు. రెండోవారు చెంతలేరు.

రాజు : మేము చెప్పము. నువ్వవట్టి తెలివి నోటివాడవు.

పద్మా : చెప్పవలసిందేమో ఆర్యపుత్రులు చెప్పనే చెప్పారు.

విదూ : చూడండీ, రెండో చెవికి తెలియనిస్తే చెడ్డ ఒట్టు, నాలుక కత్తిరించుకపోయినా సరేగాని.

రాజు : ఎందుకు బాధిస్తావు, పోనీ, మాకు చెప్పవలెనని లేదు.

పద్మా : అయ్యో! వసంతయ్యా తెలివితక్కువ! ఇంకా తెలియ జెప్పవలెనా ?

విదూ : ఏమిటి. చెప్పరుగాదూ? సరే చూస్తాను. నాకీ మాట చెప్పకుండా ఇక్కడినుంచి ఎలా కదులుతారో.

రాజు : ఏమిటీ! బలాత్కారమే?

విదూ : కాక ?

రాజు : సరే, అదేమిటో మేమూ చూస్తాము.

విదూ : అదిగో, మీరు కోపం తెచ్చుకోంపగాదు. మఱి నిజంచెప్పి తీరాలి. లేకుంటే నామీద చెడ్డఒట్టే మీకు.

రాజు : అబ్బ! వదలిపెట్టవుగదా. సరే చెప్తాము **విను.**

మధురవర్తన, రూపసంపన్న, మిగుల
గూర్చు నాకుఁ బద్మావతి గుణసమేత;
అయ్యు, వాసవదత్తాసమర్పితమగు
హృదయమును జూఱఁగొననేర దేమి సెప్ప!
పరుసమాడిన నేను, బధ్యముల్ దాఁబలుక,
నొరులు నన్ గొనియాడ సుప్పొంగిపోవుఁ జెలి,
కలికి వేళ యెఱింగి కథలు సెప్పును నాకు,
అకట! వాసవదత్త ఆలియుఁ జెలియునై
నా సుఖమె సుఖముగా, నా వెతయె వెతగాఁగ
బంటును బ్రగడయై పలుగతుల ననుగొల్చె.

వాసవ : (తనలో) ఈ మాటలచే నా దుఃఖమంతా చల్లారినట్లయింది. ఈయజ్ఞాతవాస మిదో మేలుచేసింది నాకు.

చేటి : దొరగారింత నిర్దయులనుకోలేదండీ, చిన్నమ్మ గారూ!

పద్మా : అయ్యో! ఎంతమాటంటివే! నేటికిగూడా

వాసవదత్తాదేవి గుణాలు ఇలా స్మరిస్తున్న ఆర్యపుత్రుల దాక్షిణ్యమే దాక్షిణ్యం.

వాసవ : మేలుమేలు! నీయాభిజాత్యానికి తగినట్లు పలికావమ్మా!

రాజు : సరే, మా చేత జెప్పించితివిగదా. నువ్వు చెప్పు మఱి—నీకు వాసవదత్తమీదనా ప్రీతి, పద్మావతిమీదనా?

పద్మా : బాగున్నది. ఆర్యపుత్రులు గూడా వసంతకయ్యతోపా టవుతున్నారు.

విదూ : ఓటినోటివాణ్ణి, నామాటలు లెక్కయేట గాని నా కా దేవులిద్దఱూ పూజ్యలే.

రాజు : అదిగో! ఆ టక్కరిమాటలు చాలించు. మమ్మ బలవంతపెట్టి చెప్పించుకొని నువ్వు తప్పించుకొంటున్నావు.

విదూ : అయితే నన్నుగూడా బలవంతపెట్టుతారా యేమిటి?

రాజు : ఆహా! నీచేత చెప్పించి తీరుతాము.

విదూ : మఱే, ఆ పప్పులు మనదగ్గర ఉడకవు.

రాజు : పోనీ. బ్రతిమాలుకుంటాము. సెలవీయండి, విప్రోత్తమా!

విదూ : ఆఁ. అలా దారికిరండి మఱి, చెపుతాను. వాసవదత్తాదేవి మాట చెప్పేదేమిటి? ఆ దేవిపట్ల నా కెంతో గౌరవం. ఇక పద్మావతీదేవిమాట అడుగుతారా? ఆమె వయసులాడీ, చూడచక్కంది. కోపమూ, అహంకారమూ ఎటువంటివో యెఱుగదు. ఆ దాక్షిణ్యం, ఆ మాట మంచితనం వేఱే చెప్పనే అక్కఱలేదుగదా! ఇవి యన్నీ అలా

వుండగా నా మనసుకు నచ్చిన మఱో గొప్ప గుణమున్న
దా దేవికి. మంచి మంచి పిండివంటలు చేయించి, 'వసంత
కయ్య ఎక్కడున్నా'డని అడిగి పిలిపించి మఱీ పెట్టుతుందా
తల్లి.

వాసవ : (తనలో) సరేలే. వసంతకయ్యా! జ్ఞాపకం పెట్టు
కో, ఈ మాటలన్నీ.

రాజు : సరేలే వుండు. ఈ మాటలన్నీ వాసవదత్తతో
చెప్పి నీ పని పట్టిస్తాము.

విదూ : చెప్పుకోండి. బాగా చెప్పుకోండి. ఎక్కడుంది
వాసవదత్తాదేవి? ఎన్నడో పోయింది వాసవదత్తాదేవి.

రాజు : (సవిషాదం) అవును. ఇంకెక్కడి వాసవదత్త.
నీ పరిహాసాలచే మనసు మఱచి తప్పి, పూర్వపు టలవాటు
కొద్దీ ఆ మాట జారింది.

పద్మా : ఔర ! నీ కడుపుడక, వసంతకయ్యా ! కథ
ఎంత రక్తికట్టించావయ్యా !

వాసవ : (తనలో) అమ్మయ్య, నా మనసిప్పటికి కుదుట
బడింది. మాటుపడివుండి ఈమాటలు వినేభాగ్యం కలిగింది.

విదూ : మీ రలా ఎందు కాయాసపడుతారు. ఇంతకు
విధివిలాస మిలావుంది.

రాజు : వసంతకా ! మా దురవస్థ నీ కేమి తెలుస్తుంది?

ప్రానుకట్టిన యీ ప్రేమ మఱవరాదు,
తలఁచుకోరాదు చింత నూత్నతవహించు,
బాష్పతర్పణమున ఋణభార మీఁగు
టొక్కటే చిత్తశాంతికి నున్నతెరవు.

విదూ : బాష్పపాతంచేత పంకిలమైన ముఖం కడిగి కొందురుగాని కొంచెం ఉదకం తెస్తాను.

(నిష్క్రమించును)

పద్మా : అమ్మా! కన్నీటిపొరలు గప్పిన ఆర్యపుత్రుల ముఖాని, కిదే సమయం దాటిపోదాము.

వాసవ : అలాగే నమ్మా. ఐనా నువ్వు నిలువు. ఉత్కంఠితులయిన భర్తగారి నెలా వదిలివస్తావు గనుక? నేను వెళ్ళివస్తాను.

చేటి : మంచిమాట చెప్పారమ్మగారూ! చిన్నమ్మగారూ! దొరగారి చెంతకు వెళ్ళండి మీరు.

పద్మా : వెళ్లుదునా?

వాసవ : మంచిది. వెళ్ళమ్మా!

(నిష్క్రమించును)

విదూ : (తామరాకు నీటితో ప్రవేశించి) ఇదిగో! పద్మావతీ దేవి!

పద్మా : ఏమిటది, వసంతకయ్యా!

విదూ : ఇదా? ఇది – అదేనమ్మా – ఇది.

పద్మా : చెప్పవయ్యా; చెప్పు.

విదూ : మరేమీ లేదండీ. ఏలినవారి కళ్ళలో, ఈ పాడు గాలి మూలాన రెల్లు నూగుపడి, నీరు గ్రమ్మినవి. అందు కని ముఖోదకం పట్టుకవచ్చాను.

పద్మా : (తనలో) దాక్షిణ్యంగలవారి పరిజనులకుగూడా దాక్షిణ్య మలవడుతుంది కాబోలు. (ముఖోదకం అందుకొని) ఆర్యపుత్రులకు జయం! ఇదిగో ముఖోదకం.

రాజు : ఎవరు! పద్మావతీ! (అపవారించి) వసంతకా! ఏమిటిది?

వసం : (చెవిలో చెప్పును)

రాజు : మేలు వసంతకా! మేలు. (ఆచమించి) పద్మావతీ! ఇలాకూర్చో.

పద్మా : చిత్తము. (కూర్చుండును)

రాజు : శరచ్చంద్ర గౌరములైన యీ రెల్లు పూరేణువులు గాలి కెగిరివచ్చి కన్నులలో బడినవి. అందువల్ల కనులు నీరుగ్రమ్మినవి. (తనలో) నిజముచెప్పి, యీ క్రొత్త పెండ్లికూతు మనసు నొప్పించలేను. ఎంత ధీరురాలైనా కాతరం స్త్రీ స్వభావంకదా!

విదూ : ఇవ్వాళ మధ్యాహ్నం మగధ మహారాజులుంగారు మిమ్ము పురస్కరించుకొని మిత్రులకు దర్శన మిస్తారట. ఇటువంటి సత్కారాలే ప్రతిసత్కారానికి కారణమవుతవి. ఏలినవారు మఱి బయలుదేరండి.

రాజు : అవశ్యం.

సద్గుణాధారులు సత్కారపరులు
కొల్లలు జగతిలో; గుణవిదులె లేరు.

(నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

# పంచమాంకము

(పద్మినిక ప్రవేశించును)

పద్మి : మధుకరికా, మధుకరికా! త్వరగా యిలారావే.

మధుకరిక : (ప్రవేశించి) ఇదిగో వచ్చా, నేమిటివిశేషం?

పద్మి : చిన్నమ్మగారికి తలనొప్పిగావుంది, వినలేదూ, నువ్వు?

మధు : అయ్యో! అలాగా?

పద్మి : పద, మఱి. త్వరగా వెళ్ళి అనంతికమ్మగారిని పిలువు. ఊరకే తలనొప్పిగా వుందని మాత్రం చెప్పు. ఆమె గారే వస్తారు.

మధు : ఆయమ్మ ఏమిచేస్తారు, వచ్చి?

పద్మి : ఏమిచేస్తారా, మంచిమంచి కథలుచెప్పి తలనొప్పి బాధ మఱపిస్తారు.

మధు : మంచిమాటేగాని, చిన్నమ్మగారికి పడక ఎక్కడ నేర్పాటు చేసారు?

పద్మి : సముద్రగృహంలో పరున్నారని చెప్పు. పద, నేనూ వెళ్లి వసంతకయ్య ఎక్కడున్నాడో చూచి, దొరగారితో మనవిచెయ్యమని చెప్పాలి.

మధు : సరే. అయితే వెళ్ళివస్తాను. (నిష్క్రమించును)

పద్మి : ఎక్కడున్నాడో యీ వసంతకయ్య!

(విదూషకుడు ప్రవేశించును)

విదూ : వాసవదత్తాదేవి మరణంవల్ల దిగులుపడివున్న ప్రభువుకు, పద్మావతీదేవిని చెట్టపట్టిన యీ మంగళోత్సవ

సమయంలో మదనాగ్నితాపము హెచ్చుపెఱిగి పోతున్నది. (పద్మినికను చూచి) ఇదిగో! పద్మినిక! ఏమి పద్మినికా! విశేషాలు చెప్పవూ?

పద్మి : మీరు వినలేదుటండీ! మా చిన్నమ్మగారు తలనొప్పివల్ల బాధపడుతున్నారని?

విదూ : ఆలాగా! అయ్యో. నేను విననేలేదు సుమీ.

పద్మి : మఱి మీరు త్వరగా వెళ్లి దొరగారికి మనవిచేయండి. నేనూ వెళ్ళి శీర్షాను లేపనం పట్టుకవస్తాను.

విదూ : పద్మావతీదేవి ఎక్కడ పండుకొన్నారో?

పద్మి : సముద్రగృహంలో వేయించాము శయ్య.

విదూ : అయితే పద? నేనూ వెళ్ళి ఏలినవారికి మనవి చేస్తాను. (నిష్క్రమింతురు.)

ఇది ప్రవేశకం

(రాజు ప్రవేశించును.)

ఆయెంబోయె నవంతిరాజసుత, నేనంతంతటన్ వెండియున్
జాయం గైకొని గేస్తునై తినని స్వాస్థ్యంబాత్మ కొక్కింత లే
దాయెన్, మంచునఁగ్రగ్గు తమ్మివలె నాఁడ య్యగ్నినిర్దగ్ధమై
మాయంబైన లతాంగి సౌరె మదిలో మాటాకు హత్తించెడిన్,

విదూషకుడు : (ప్రవేశించి) మీరింకా ఇక్కడే వున్నారా! రండి, రండి వేగిరం.

రాజు : ఏమిటీ తొందర?

విదూ : ఇంకా తొందరేమిటంటున్నారా! ఒక చెంప పద్మావతీదేవి శీర్ష వేదన పడుతూంటే.

రాజు : దేవికి శీర్ష వేదనా! ఎవరన్నారు నీతో?

విదూ : పద్మినిక చెప్పిందండీ.

రాజు : ఏమి దురవస్థ వచ్చిందోయీ !

పరిణయమైతి వెండియును బావనశీల శుభాంగి, దుఃఖపుఁ
భరము శమించుచున్నతటి బాపురె ! దేవికి కష్టమబ్బుటఁ
వెలుపుదయించు చున్ననుభవించిన దారుణదుఃఖసంస్మృతిఁ
బలిపలి రీతులఁ మనసు వాఱు ననర్థము శంకసేయుచుఁ.

ఇంతకు దేవి యెచ్చట నున్నదో చెప్పవైతివి ?

విదూ : సముద్రగృహంలో శయ్య ఏర్పాటుచేసారు.

రాజు : అయితే అక్కడికే త్రోవతియ్యి.

విదూ : చిత్తం దయచేయండి. (ఇరువురును బరిక్రమింతురు.)

విదూ : ఇదే సముద్రగృహం, ప్రవేశించండి.

రాజు : ముందు నువ్వు పదవోయి.

విదూ : చిత్తం. (ప్రవేశించి) అమ్మ బాబయ్యో! చచ్చాను, చచ్చానండి.

రాజు : ఏమి మునిగింది ?

విదూ : త్రాచు త్రాచండీ. దీపపు వెలుగున ఎలా మెద లాడుతున్నదో చూచారూ ?

రాజు : (ప్రవేశించి చూచి, నవ్వుచు) నాగఃశాముకాదోయి, వెఱ్ఱినాగమ్మా ?

నిడుదయై తోరణమునుండి నేలమీఁద
వేలుకాడుచునున్న యీపూలదండ
మసమసకసందెచీకటి, మందపవన
వశతఁ గదలాడు సర్పవిభ్రాంతిదోప.

విదూ : (నిరూపించి) నిజమేనండీ. ఎబ్బే! పాము కానేకాదు. (లోపల ప్రవేశించి చూచి) పద్మావతీదేవి ఇచటికివచ్చి తిరిగి వెళ్లినట్లున్నారు.

రాజు : లేదోయీ! మొదలే రాలేదిచటికి.

విదూ : ఎలా తెలుసుకున్నారబ్బా!

రాజు : ఇలాగు. చూడు!

తలిమము పంగలేమ, ముడుతల్వడి దుప్పటి నల్గ దింతయుఁ,
దలకిడు లేపనమ్ము లుపధానము నంటగలేదు, రోగి చూ
డ్కుల నెలయించు శోభయును గొందొకసేయరు, రోగి యింతలో
నలవున సెజ్జవీడి తనయంత నెటుల్ చననేర్చుఁ జెప్పుమా.

విదూ : అయితే, దేవి వచ్చేవఱకు తమరా శయ్యపై కొంచెం విశ్రమించండి.

రాజు : మంచిది. (కూర్చుండి) మాకు నిద్రవస్తున్నది. ఏదైనా కథ చెప్పవోయి.

విదూ : మఱి ఊఁకొట్టండి చెప్పుతాను.

రాజు : ఊఁ.

విదూ : అనగనగా ఉజ్జయిని అని ఓ నగరముంది. అక్కడ స్నానంచేయటానికి చక్కని కొలకు లున్నవి.

రాజు : ఉజ్జయినీ కథ మొదలుపెట్టావేమిటి?

విదూ : పోనిండి. మీకిష్టం కాకపోతే మఱోటి చెప్పుతాను.

రాజు : ఇష్టం కాకపోవడం కాదు.

నన్నటువెంటనంటి పయనమ్మయి వచ్చెడివేళ నాత్మలోఁ
గన్నజనంబుపై మరులు గాటముగా, నిలువోపలేక, వా
ల్గన్నుల నశ్రుబిందువులు గ్రమ్మగ నాయెద వ్రాలి, బాష్పముల్
మిన్నక జార్చునయ్యతివ నెయ్యము గ్రమ్మెడి నిప్డు నెమ్మదిన్,

వీణగఱచువేళ వెలది నాచెంతను
జూడ్కి-దోయి నన్ను జూఁడవిడిచి
స్రస్తకోణమైన హస్తమ్ముతో వట్టి
బయలు మీటినట్టి భంగు లెంతు.

విదూ : పోనీండి. మఱొకకథ చెపుతాను. అనగనగా బ్రహ్మదత్తమని ఓ పట్టణం. కాంపిల్యుడనే రాజు ఆ పట్టణ మేలుతున్నాడు.

రాజు : ఎట్లా ఎట్లాగూ!

విదూ : (మరల నట్లులే చెప్పును.)

రాజు : అట్లా కాదోయి మూర్ఖుడా! నగరం కాంపిల్యమూ, రాజు బ్రహ్మదత్తుడూ అని చెప్పు.

విదూ : ఏమన్నారూ? బ్రహ్మదత్తుడు రాజూ, నగరం కాంపిల్యమూనా?

రాజు : అవును.

విదూ : అయితే ఓ క్షణమాగండి. కొంచెం సంత చెప్పి నోట పట్టించుకొంటాను. (పలుసార్లు వల్లెవేయును.) ఆఁ, రాజు బ్రహ్మదత్తుడూ, నగరం కాంపిల్యమూ. ఇక ఊఁ కొట్టండి. అప్పుడే నిద్రపట్టినట్లున్నది. అబ్బబ్బ! ఏమి చలి! నేనింతలో వెళ్లి దుప్పటన్నా తెచ్చుకుంటాను. (నిష్క్రమించును.)

(అవంతికా వేషమున వాసవదత్తయు జేటియు బ్రవేశింతురు.)

చేటి : రండి, అమ్మగారూ రండి. చిన్నమ్మగారు తల నొప్పితో మాచెడ్డ బాధ పడుతున్నారు.

వాస: అయ్యో, పాపం. ఆబిడకు ప్రక్క ఎక్కడ వేసారు?

చేటి : ఇదిగో, ఈ సముద్రగృహంలోనే.

వాసవ : అయితే పద. ముందు నడువు.

(ఉభయులు పరిక్రమింతురు.)

చేటి : ఇదే సముద్రగృహం. తమరు లోనికి వెళ్లండి. నేను శీర్ష లేపనం త్వరగా తీసుకవస్తాను. (నిష్క్రమించును)

వాసవ : దేవతల కెంత పగదాన నైపోయినానో! నా విరహదుఃఖంవల్ల ఆరాటపడుతున్న ఆర్యపుత్రులకు పద్మావతి వల్ల కొంత ఊఅట కలిగిందిగదా అనుకుంటే ఇంత లోనే యీమెకిట్లు జబ్బు చేయవలెనా?

(ప్రవేశించి చూచి) అయ్యయ్యో! పద్మావతికి తోడుగా దీపంమాత్రం వెలిగించి పరిచారిక లంతా యెక్కడివా ళ్ళక్కడ చక్కాపోయినారు. ఎంతప్రమాదం! పద్మావతికి నిద్ర పట్టినట్లున్నది. ఇలాకూర్చుంటాను. (కూర్చుండబోయి) ఇక్కడ దూరంగాకూర్చోవడం మా స్నేహానికి కొఱత అని పిస్తుంది. కనుక ఆమె శయ్యమీదనే కూర్చుంటాను. (కూర్చుండి) ఆహా! ఈమెప్రక్క నిలాకూర్చుంటే మనస్సు కెంత ఆహ్లాదంగానో వుంది. అమ్మయ్య! ఊపిరి తెంపు లేకుండా సుఖంగా విడుస్తున్నది. జబ్బు జారినట్లే. ఇదిగో! ఒక చెంత కొత్తిగిలి ఈ పండుకోవడం చూస్తే తన్ను గాగిలించు కొని పండుకొమ్మని కాబోలు. ఆలాగే పడుకొంటాను.

(పండుకొన్నది)

రాజు : (కలవరించును.) అయ్యో! వాసవదత్తా!

వాసవ : (తటాలునలేచి) ఔరార! పద్మావతి కాదు. ఆర్యపుత్రులు. నన్ను చూచారేమో! చూస్తే యౌగంధరాయణుల ప్రయత్నమంతా వ్యర్థమైపోతుందిగదా? ఏమి చేతును?

రాజు : అవంతి రాజపుత్రీ!

వాసవ : నయమే! కలవరిస్తున్నారార్యపుత్రులు. ఇక్కడ ఎవ్వరూ లేరు. కొంచెంసేపు నిలిచి ఆర్యపుత్రులను కళ్ళారా చూచుకొని, మనసారా సంతోషిస్తాను.

రాజు : నెచ్చెలీ! నా ప్రియశిష్యురాలవు, పలుకవేమి?

వాసవ: పలుకకేమి: నాథా! పలుకుతూనేవుంటిని గదా.

రాజు : కోపమా, నామీద?

వాసవ : లేదు లేదు. దుఃఖిస్తున్నాను.

రాజు : కోపం కాకపోతే, ఎందుకని అలంకరించుకోలేదూ?

వాసవ : ఇంతకంటేనా?

రాజు : విరచికను స్మరించడం లేదుగదా?

వాసవ : (కోపంతో) చాలింతురూ. ఇక్కడా విరచిక మాటేనా?

రాజు : ఇదిగో! బ్రతిమాలుకొంటాను. విరచికమాట మఱచిపోయి, నన్ను మన్నించవూ? (చేతులు సాచును)

వాసవ : చాలా సేపయింది. ఎవరైనా చూచిపోతారు. ఇక వెళ్ళుతాను. పోనీ. క్రిందవ్రేలాడుతూన్న ఆర్యపుత్రుల హస్తం ప్రక్కపైనుంచి మరీ వెళ్ళుతాను.

(అట్లుచేసి నిష్క్రమించును.)

రాజు : (తటాలున లేచి) ఆగు, వాసవదత్తా ! ఆగు. అక్కటా !

తత్తఱమున వెంటఁ దగిలి యేగుచునుండ
ద్వారపక్షమట్టె తలకుఁదగిలె;
కలయొ, యిద్ది ! కాక, కడచన్నవృత్తమో !
ఎఱుఁగఁజాల నింక నేమిసేతు ?

విదూషకుడు : (ప్రవేశించి) ఓహో ? నిద్రలేచారే! అప్పుడే.

రాజు : నెచ్చెలీ ! నీకొక మంచివార్త చెప్పనా ? వాసవదత్త బ్రదికివున్నదోయీ !

నిజతనూవిభ్రమైకాస్త్రనిహతి, రెప్ప
తలుపులన్ భిన్నమొనరించి, కలికి నాదు
కంటిద్వారము నిచ్చమై గడచిపోయి
హృదయగేహమ్ము జొచ్చె, నిం కేమిసెప్ప !

విదూ : ఇంకెక్కడి వాసవదత్తండీ ! మీకు మతి పోయి నట్లున్నది. అయ్యో ! ఆమెపోయి ఎంతకాల మయినదండీ !

రాజు : వట్టిదోయి. ఆ మాటలన్నీ వట్టివి. శయ్యపై నిద్రిస్తున్న మమ్ము మేల్కొలిపి, ఇప్పుడేగదా దాటిపోయి నది. అగ్నిదగ్ధమైనదనిచెప్పి ఋమణ్వంతుడు మోసగించాడు మమ్ము. ఇంతయెందుకు :

వన్నెగులుకఁ బద్మావతీవదనమందు
దిలక మేనాడు గంటినో తెలిసె నపుడె
జీవములతోడ నున్నది దేవి, యయ్యు
వంతికయటంచు. శంకింప వలవదింక.

విదూ : బాగున్నది. ఇది యెక్కడనైనా కద్దటండీ, చచ్చినవాళ్లు బ్రతికి రావడం? ఇందాక ఉదకస్నానాల మాట అనుకున్నాము కాదూ, దేవి జ్ఞప్తికివచ్చి, ఆ యాలోచనతో గన్ను మూసారేమో, ఆమె కలలో కనిపించింది.

రాజు : కలయె యగునేని యిది, ఇంతకంటె నేమి
కలదు ధన్యత, మెలకువ వలవదింక.
ఇదియు విభ్రమమగునేని, ఇట్టి విభ్ర
మమ్మె లభియించుఁగాక, చిరమ్ము మాకు.

విదూ : అది కాదండోయి! అన్నట్లు, ఈ వూళ్లో అవంతిసుందరి అనే యక్షిణి వున్నదటండీ, అది యేమైనా కనిపించిందేమో మీకు.

రాజు : వట్టిది వట్టిది.

ముంగురులు ఫాలతలమున ముసరఁ, గనుల
గాటుకయు లేక, శీలరక్షణము సేయు
చున్న ముద్దియ నెమ్మోము గన్నులారఁ
గంటి మేల్కొని, స్వప్నముగాదు నిజము.

ఏమిటికి సంశయించెద విదిగొ చూడు
భీతభీతాత్మయగు దేవి ప్రియమెలర్ప
స్వప్నమునఁ బట్టి కొన్న యీ బాహువునకుఁ
బొడమినట్టి గగుర్పాటు విడువదింక.

విదూ: సరేకాని, ఈ యనర్థవిచార మింతట జాలించి దయచేయండి, చతుశ్శాలలోకి వెళ్లుదాము.

కంచుకి : (ప్రవేశించి) జయము జయ మార్యపుత్రులకు,

మాదర్శక మహారాజులుంగారు సెలవిస్తున్నారు. తమ అమాత్యుడు ఋమణ్వంతుడు ఆరుణిని మర్దించడానికి ఎత్తి వచ్చాడు. మా చతురంగబలాలుకూడా సన్నద్ధమైవున్నవి. తమరు బయలుదేరండి.

ఛిన్నభిన్నమ్ముగాఁ జెదరెను దాయ, త్వ
ద్గుణశక్తి నూఁటగొన్నది ప్రజ
నీ ప్రయాణపువేళ నిరుపద్రవమ్ముగాఁ
బరిరక్షితము లిరుపార్శ్వములును
మంత్రిసత్తముఁడు ఋమణ్వంతుఁ డురుబలో
పేతుఁడై దాయపై నెత్తివచ్చె
సమదవారణతురంగమరథపాదాతి
బలముల నాయత్తపఱచినాము
దుర్మదుండగు శాత్రవు దునుముపొంతెఁ
జేయఁగల యంతవట్టును జేసినాము
లెమ్ము, సురనది దాఁటె బలమ్ము, లింక
వత్సరాజ్యరమణ జెట్టపట్టికొమ్ము.

రాజు : (లేచి) మంచిది. ఇదిగో,

క్రూరతరబాణవీచీ
ఘోరమ్మును, మత్తదంతిఘోటకతీర్ణ
మ్మౌ రణవారిధి నారుణి
దారుణ మదఁగించి మించి దాఁటణసేతుణ.

(అందరు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.

# షష్ఠాంకము

కంచుకి : (ప్రవేశించి) ఎవరిక్కడ? ఈకాంచనతోరణ ద్వారమం దెవరున్నారు?

ప్రతీ : (ప్రవేశించి) నేనండీ, విజయను. ఏమి సెలవు?

కంచుకి : ఇదిగో, వత్సరాజ్యలాభ ప్రవృద్ధోదయులైన ఉదయనులవారికి నివేదించు. మహాసేనులవారి సముఖం నుంచి రైభ్యసగోత్రుడైన కాంచుకీయుడున్నూ, అంగారవతీదేవివద్దనుండి, వాసవదత్తాధాత్రి వసుంధరమ్మయున్నూ వచ్చారనీ, ద్వారమందున్నారనీ.

ప్రతీ: ఇది ప్రవేశించేదారికాదు, మనవిచేసే వేళాకాదండీ.

కంచుకి : ఎందువల్ల?

ప్రతీ : మనవిచేస్తాను. ఇవ్వాళ్ళ ఏలినవారి సుయామున ప్రాసాదంలో ఎవరో వీణవాయించారు. ఏలినవా రది విని ఘోషవతివలె వున్న దనుకొన్నారు.

కంచు : అలాగా? అనక ఏమయింది?

ప్రతీ : అక్కడికి వెళ్ళి నీకీవీణ ఎక్కడిదని అడిగినంతట అతడు ''నాకిది యమునాతీరాన రెల్లుదుబ్బులలో దొరికింది. ప్రభువులకు కావలిస్తే తీసుకోనండి'' అన్నాడు. ఏలినవారావీణను ఒడిలోపెట్టుకొని మూర్ఛిల్లారు. మళ్ళా కొంత సేపటికి తెప్పిరిల్లి, కంట నీరుపెట్టుకొంటూ, ''ఘోషవతీ! నువ్వు దొరకితివిగాని ఆమె దొరకలేదుగదా'' అంటూ వాపోయినారు. ఇటువంటి అవేళలో నేనెలా మనవిచేతును?

కంచు : అలాగా! మేమూ ఆపనిమీదనేవచ్చాము, కనుక వెంటనే మనవిచెయ్యి.

ప్రతీ : చిత్తము. అదుగో! ఏలినవారు సుయామున ప్రాసాదమునుండి దయచేస్తున్నారు. మనవిచేస్తాను.

కంచు : మంచిది. (ఉభయులు నిష్క్రమింతురు)

(రాజు విదూషకుడు ప్రవేశింతురు)

రాజు: ప్రాణము ప్రాణమైన చెలియంకమె మెత్తనిసెజ్జగాఁగఁ, ద
త్పీనపయోధరద్వయమె దిండుగఁబండెడు నీవు పక్షిసం
తానవికీర్ణపాంసుభరదండముతో నెటులుంటి కానలో?
వీణవె నీవు ఘోషవతి! వీనులవిందపుకావె నెచ్చెలీ!

అయ్యో! ఘోషవతీ! దేవిపైగల నీనెయ్యమంతా ఏమయిపోయింది? మఱచితివటే ఆతపస్విని?

శ్రమజలసిక్తమౌ చనుల సందిటిగుత్తపుఁ గౌఁగిలింతసౌ
ఖ్యము, కటిభారమెత్తునపు డబ్బిన మెత్తని ప్రక్కయొత్తిడుల్
తెమలని మద్వియోగపరిదేవన భంగులు, వాద్యపుణ్ విరా
మములను సస్మితమ్ములగు మంతనముల్ మది విస్మరించితే?

విదూ : అదేపనిగా ఎందు కలావిలపిస్తారు? ఓదార్చు కోండి.

రాజు : మాకింక ఒకటే ఓదార్పు.

దేవి చెలియయైన యీవిపంచిక మేలు
కొలిపెఁ జిరము నిదురగూరియున్న
మామనోరథమును, మఱి యీయువంతిరా
ట్తనయయైన దేవి కనులఁబడదు.

రాజు : అవును. ఇందులో దోషమేముంది ?

పద్మా : ఆర్యపుత్రులు తిరిగి వివాహంచేసుకున్నా రని వారు చిన్నబుచ్చుకుంటారేమో.

రాజు : అలా కాదు. పద్మావతీ ! వారు కళత్రదర్శనార్హులుగాని అన్యులుకారు. నిన్ను దాచి దర్శనమివ్వడం దోషం. రా, కూర్చో.

పద్మా : చిత్తం. (కూర్చుండి) బాబయ్యగారూ, అమ్మయ్యగారూ ఏమని వర్తమానంచేసారో అని నామనస్సారాట పడుతూవుంది.

రాజు : అవును. పద్మావతీ!

ప్రుచ్చునై కొనితెచ్చిన ముద్దరాలి
నోమికోలేని మందభాగ్యుండ, దోస
కారి తనయుఁడు తండ్రిమొగమ్ము జూడ
బెదరుగతి నిప్డు నాయెడ భీతివొడము.

పద్మా : ఇంతకు గాలం దీఱినప్పు డెవరినెవరు రక్షించ గలరు ?

ప్రతీ : (ప్రవేశించి) ఆ కాంచుకీయులూ, ధాత్రీ ద్వారమం దున్నారు.

రాజు : వెంటనే ప్రవేశపెట్టు.

ప్రతీ : చిత్తము.

(నిష్క్రమించును)

(కంచుకి, ధాత్రి, ప్రతీహారి ప్రవేశింతురు)

కంచు: అల్లుని ప్రాప్తరాజ్యు గననయ్యెఁగదా యని సంతసింతునా?
త్రెళ్ళిన రాచకూఁతును మతిఁదలపోసి విషాదమందనా?
చెల్లరె! యెంతచేసితి విసీ యిసి! రాజ్యమె దాయ కిచ్చి, ఆ
తల్లినె మా కొసంగఁదగదా? విపరీతపుఁ గూళదైవమా!

ప్రతీ: దయచేయండి. అదుగో ఏలినవారు!

కంచు: (సమీపించి) ఆర్యపుత్రులకు జయము.

ధాత్రి: జయము జయ మేలినవారికి.

రాజు: (సబహుమానముగా)

పుడమిగల రాచవంగడమునకు నెల్ల
భ్రుకుటిచేఁ జేటు, గడకంటఁ బ్రోపుగూర్చు
మనుజపతి, నాకుఁ గడుగూర్చు మామగారు
సేమమేగద? ఆ మహాసేను లార్య!

కంచు: చిత్తం. మహాసేనులవారికి కుశలం. ఇచటి మీయందటి కుశలం అడిగారు.

రాజు: (ఆసనముదిగి) మహాసేనులవారియాజ్ఞ వినిపించండి.

కంచు: వైదేహీపుత్రులగు దేవర కీవినయ మెంతైనా తగివుంది. ఆసనస్థులైవుండే మహాసేనసందేశం వినవచ్చు.

రాజు: మహాసేనుల చిత్తానుసారం.

(కూర్చుండును)

కంచు: శత్రు లపహరించిన రాజ్యం తిరిగీ సంపాదించినందుకు పరమసంతోషం. ఎందువల్లనంటే - అశక్తులకూ, భీరువులకూ ఉత్సాహం వుండదు. ఉత్సాహవంతులకేగాని ఇతరులకు రాజ్యలక్ష్మి దక్కదు.

రాజు : ఇదియంతా మహాసేనులవారి ప్రభావమే.

నన్నటు బందెవెట్టి నిజనందనునింబలె నేలికొన్న మే
లెన్నక, తత్తనూజ హరియించి, తుదిం జెలి మిత్త్రికిచ్చు నీ
చెన్నటి యెగ్గుసైచి, యిటు సేమమునారయు తేనికే తగుఞ్
సన్నుతులెల్లఁ, దత్కృపయె నాకిడెఁ గ్రమ్మఱ వత్సరాజ్యముఞ్,

కంచు : మహాసేనులవారి సందేశం మనవిచేసాను. దేవి సందేశ మీబిడ మనవిచేస్తుంది.

రాజు : షోడశాంతఃపుర జ్యేష్ఠు రాలైన పుణ్యాత్మురాలు, నాప్రవాసకష్టానికి దుఃఖించిన నాతల్లి, ఆనగరదేవతకు సేమమేనా అమ్మా!

ధాత్రి : అమ్మగారు కుశలంగా వున్నారు. ఇచట మీయందఱి కుశలం అడిగారు.

రాజు : మాయందఱి కుశలమునా, ఇదుగో చూస్తున్నారుగా మాకుశలం.

ధాత్రి : వద్దు. వద్దు దుఃఖించకండి ఏలినవారు.

కంచు : ఔను. తమరు దుఃఖించబనిలేదు. ఏలినవారి కింత దుఃఖకారణమైన మహాసేనపుత్రికి మరణమే లేదంటాను ఇంతకు.

కాలము మూడినప్డు దను గాచెడి నెవ్వడు, కుండ నూతిలోఁ
గూలకయున్నె త్రాడుదెగి, కుందఁగనేటికి ప్రాణికోటి కి
క్కాలవశమ్మనన్ బ్రదుకు, కాలముచేతనె చావు నిక్కమౌ:
కాలమునన్ జిగిర్చి, మఱికాలమునన్ జెడుఁ జూడుమా వనుల్,

రాజు : ఆర్యా. అలా అనకండి.

అకట! నే గోలుపోయిన యనుంగుశిష్య
రాలి, నాదేవి, నాప్రియురాలి, నా ని
ధానమును, బ్రాణమును, మహాసేనతనయ
మఱవనేర్తునే వేయి జన్మములకైన.

ధాత్రి : అమ్మగారిలా మనవి చేయవలసిం దన్నారు. మహాసేనులవారూ, నేనూ నిన్ను మాపిల్లలు గోపాలపాలకులవంటివాడవే అనుకొన్నాము. ఆ ప్రీతిచేతనే మొదటినుంచీ నువ్వే మా అల్లుడవు కావాలనికోరి ఉజ్జయినికి రప్పించుకొన్నాము. వీణాశిక్షణ మిషతో మా బిడ్డను అగ్నిసాక్షికంగా నీ చేతులలో పెట్టాము. నువ్వేమో వివాహమంగళం జరగకుండగానే, చాపలంకొద్దీ పిల్లను తీసుక వెళ్ళిపోయినావు. మేమంతట మీయుభయుల ప్రతికృతులు చిత్రఫలకములపై వ్రాయించి, ఆ ఫలకములకు యథావిధిగా వివాహంచేసి ఆ కొఱత తీర్చుకొన్నాము. ఇవిగో, ఆ ప్రతికృతులు నీకు పంపుతున్నాము. నాయనా! పోయిన బిడ్డ పోనేపోయింది. నువ్వు వీటిని చూచుకొని మనస్సు సమాధానపఱచుకో.

రాజు : ఆ దేవికి నాయందలి ప్రీతి అటువంటిది. కనుకనే నా యపరాధములన్నీ మఱచి, నేటికిగూడా ఇంత చల్లనివార్త పంపించారు. ఈ యౌదార్య మా దేవికే తగును. నాకు నూరు రాజ్యాలు లభించినదానికంటె ఆ తల్లి మాటలే ఎక్కువ సంతోషమిస్తున్నవి.

పద్మా : ఆర్యపుత్రుల సెలవైతే మా అక్కగారి పటం చూచి నమస్కరిస్తాను.

ధాత్రి : చూడు తల్లీ ! చూడు. (పటము చూపుచున్నది.)

పద్మా : (చూచి తనలో) ఇది అచ్చంగా అవంతికమ్మ రూపాన్ని పోలివుంది. (ప్రకాశం) చూడండీ ! ఈ పటంలో రూపం మా అక్కగారిని పోలివుందేమో.

రాజు : (చూచి) సందేహమెందుకు ! పోలికే కాదు. ఆమెయే యిందున్నది.

ఇంత స్నిగ్ధమైన యీ వర్ణమున కెట్లు
దాపరించె నట్టి దారుణమ్ము ?
ఇంతముద్దులొలుకు నీమోముదమ్మియు
నగ్గిసెకలలోన గ్రుగ్గెనొక్క ?

పద్మా : ఆర్యపుత్రుల చిత్రపటంకూడా చూస్తే సరి. ఇది అక్కగారి పోలికవునో కాదో తెలిసిపోతుంది.

ధాత్రి : చూడు తల్లీ ! చూడు.

పద్మా : ఇది అచ్చంగా ఆర్యపుత్రుల పోలికే. ఇంకా సందేహ మెందుకు ? ఈ పటం అక్కగారిదే.

రాజు : దేవీ ! పటం చూచిందిమొదలు నీకు హర్షోద్వేగములు కలుగుతున్న వెందువల్ల ?

పద్మా : ఈ పటాన్నిపోలిన యామె ఇక్కడే వుంటున్నది.

రాజు : వాసవదత్త పోలికేనా ?

పద్మా : అవును.

రాజు : అయితే పిలిపించుమటి.

పద్మా : నేను కన్యగా వున్నప్పుడొక బ్రాహ్మణుడు "ఈమె నా చెల్లె"లని వప్పగించి వెళ్లినాడామెను. భర్తను విడిచి వున్నందువల్ల ఆమె పరపురుషుల కంటబడదు. ఆమె నాతోగూడా వున్నప్పుడార్యపుత్రులు చూడవచ్చును.

రాజు : విప్రసోదరి అయితే ఆ మె మటి యెవరో? లోకంలో మనిషిని బోలిన మనిషి వుండడంకద్దు.

ప్రతీహారి : (ప్రవేశించి) జయము జయమేలినవారికి. ఎవరో బ్రాహ్మణుడు ఉజ్జయినినుండి వచ్చి "నా చెల్లెలిని దేవిచెంత విడిచివెళ్లాను. మళ్లా తీసుకపోతా"నంటూ వచ్చి ద్వారమందున్నాడు.

రాజు : పద్మావతీ! ఆతడే నేమో?

పద్మా : కావచ్చును.

రాజు : ఆ బ్రాహ్మణుని అంతఃపురమర్యాదలతో వెంటనే ప్రవేశపెట్టు.

ప్రతీ : చిత్తం. (నిష్క్రమించును)

రాజు : పద్మావతీ! నీవామెను తోడ్కొనిరా.

పద్మ : చిత్తం. (నిష్క్రమించును.)

(ప్రతీహారిణి యౌగంధరాయణుడు ప్రవేశము)

యౌగం : (తనలో) ప్రభుహితంకోరి, ఇన్నాళ్లూ దేవిని మాటు పఱచినందుకు నేటికి నా సంకల్పమైతే యీడేరింది కాని, ప్రభువు ఏమంటాడోకదాయని మనస్సు బాధిస్తున్నది.

ప్రతీ : అదుగో! ఏలినవారు సమీపించండి.

యౌగం : (సమీపించి) జయము జయం ప్రభువులకు.

రాజు : ఈకంఠస్వర మెక్కడో విన్నట్లున్నది. ఏమండీ! మీ చెల్లెలిని పద్మావతి కప్పగించి వెళ్ళినారటకాదూ?

యౌగం : చిత్తము.

రాజు : అయితే ఆమెను వెంటనే తోడుకొనిరండి.

ప్రతీ : చిత్తం. (నిష్క్రమించును)

(ప్రతీహారి, అవంతిక, పద్మావతి ప్రవేశింతురు)

పద్మా : రావమ్మా, రా! నీకో మంచివార్త చెపుతాను.

వాసవ : ఏమిటావార్త!

పద్మా : మీ అన్నగారు వచ్చారు.

వాసవ : ఆయన కింకా జ్ఞాపకముండటం మహాభాగ్యం.

పద్మా : (సమీపించి) ఆర్యపుత్రులకు జయం. ఈమెనే నాచెంత దాచబెట్టినది.

రాజు : అయితే వప్పగించు. అలాకాదు. న్యాసాన్ని సాక్షులయెదుట వప్పగించటం మంచిది. ఇదిగో! ఈరైభ్యుడూ, ఆయమ్మయూ సాక్షులు. వారియెదుట వప్పగించు.

పద్మా: ఇదిగోనండి. మీచెల్లెలిని వప్పగించుకోండి.

ధాత్రి : (అవంతికను చూచి) అమ్మో! మాతల్లి, మాతల్లి, వాసవదత్త.

రాజు : ఏమీ! మహాసేనపుత్రియా! దేవీ! పద్మావతీ, నువ్వూ అంతఃపురంలోకి వెళ్ళండి.

యౌగం: వద్దువద్దు నాచెల్లెలి నంతఃపురంలోకిపంపకండి.

రాజు : అలాఅనకండి. ఆమె మహాసేనపుత్రి.

యౌగం: ఖ్యాతనృపాలవంశదీపకుఁడటంచు
వినయనిధి, వేత్త, శుచియంచుఁ బేరుగాంచి
రాజధర్మదేశికుఁడవై రాజచంద్ర!
పరులసొమ్మిట్లు బల్మిమై పట్టఁదగునె?

రాజు: అయితే మేలిముసుగు తొలగించి ఆపోలిక యెట్టిదో చూచెదము.

యౌగం : జయము జయమేలినవారికి.

వాసవ : ఆర్యపుత్రులకు జయం.

రాజు : ఏమిటిది! యౌగంధరాయణులూ, మహాసేన పుత్రీనా!

నిక్కమా, కలయా యిది! నెలఁత తొల్లి
యిటులె నాకంటఁబడియు నదృశ్యమాయె- (పరిశీలించి చూచి)
పోలిసి, యేదేవి గవగూడఁ దలఁచినానొ
ఆపె యీపుట్టువుననె నాకబ్బెనెట్లు!

యౌగం : దేవి నిన్నాళ్ళు దాచియుంచిన అపరాధిని, మన్నించాలి ఏలినవారు. (పాదములపై బడును)

రాజు: (లేవనెత్తి) యౌగంధరాయణులే అగుదురుమీరు!

రిత్తయున్మాదము నటించి, రిపులఁదునిమి
మంత్రములుపన్ని, బహువిపన్మగ్నమాను
లైన మము నుద్ధరించినయట్టి నీదు
నీతివిక్రమములను వర్ణించుకొందు.

యౌగం: ఏలినవారిని కష్టసుఖములం దనుగమించడమే కదా మాపని.

పద్మా: ఔరౌర! వాసవదత్తా దేవియా యీమె! అమ్మా! తెలివిమాలినదాన్ని, సఖీజనమనుకొని మీపట్ల ఎంతైనా అపచారం చేసాను. మీ పాదాలుపట్టి వేడుకొంటున్నాను. మన్నించరూ?

వాసవ: (లేవనెత్తి) లే! సౌభాగ్యవతీ లే, అర్థియైవచ్చిన లోప మీ శరీరముదే కాని ఇందు నీ దోష మేమున్నది తల్లీ!

పద్మా: అనుగ్రహం.

రాజు: నెచ్చెలీ! యౌగంధరాయణా! దేవి నెందుకు దాచిపెట్టావు?

యౌగం: కౌశాంబినైనా రక్షించుదామని.

రాజు: మఱి దేవిని పద్మావతి కప్పగించడం దేనికి?

యౌగం: ఈ తల్లి మాకు దేవి అవుతుందని జ్యోతిష్కుల వల్ల విని అలా చేసాను.

రాజు: ఋమణ్వంతుడుగూడా ఎఱుగునా యీ తంత్రమంతా?

యౌగం: చిత్తం. అందఱూ ఎఱిగిన తంత్రమే యిది.

రాజు: ఔర, ఋమణ్వంతుడూ! ఎంత దొంగ!

యౌగం: దేవి కుశలంగావున్న శుభవార్త ఈ రైభ్యులూ, ఈ యమ్మా నేడే ఉజ్జయినికి కొంపోవడం మంచిది.

రాజు : కాదు కాదు. పద్మావతితోఁగూడా మనమంతా బయలుదేరి వెళ్లుదాం ముజ్జయినికి.

యౌగం : ఏలినవారి చిత్తానుసారం.

**భరత వాక్యము,**

హిమగిరియు వింధ్యమును గుండలములుగాఁగ,
నబ్ధి మొలనూలుగాఁగ నేకాతపత్ర
మైన మేదినీమండలమందు సతము
జెల్లుఁగావుత మారాజసింహునాజ్ఞ.



Printed at the B. N. K. Press, Madras—Q. H. No. Ms. 100/B.
For Q. H. No. 401, Cat. D. 750 Copies—March 1946.